# హిందీ అధ్యాపక్

సందాపురం బిచ్చయ్య

శ్రీ లక్ష్మీనరసింహ పబ్లికేషన్స్,
నాగవరం, వనపర్తి (P.O.)

హిందీ అధ్యాపక్ — ఎస్. బిచ్చయ్య

ప్రథమ ముద్రణ 1999 జూన్

ప్రతులు: 1,000

సర్వహక్కులు రచయితవి

వెల: రూ॥ 15 రూ॥

ప్రతులకు: శ్రీమతి ఎస్. సుభద్రమ్మ,
శ్రీ లక్ష్మీ నరసింహ స్వామి పబ్లికేషన్స్,

నాగవరం, వనపర్తి (పోష్టు) - 509103
మహబూబ్‌నగర్ (జిల్లా).

# భారత సర్కారీ భాష హిందీ

మన భారతీయులకు స్వతంత్రం వచ్చిన తర్వాత తేదీ 13-9-1949 నాడు అన్ని రాష్ట్రాల విద్యావేత్తలు సమావేశమై అందులో ఈ క్రింది విధముగా తీర్మానాలు చేసుకున్నారు. శ్రీ కే.యం. మున్షీ గారు మరియు గోపాలస్వామి అయ్యంగారు బిల్ ప్రవేశపెడుతూ ఇలా అన్నారు. "ఈనాడు మన దేశంలో అన్ని భాషల సంస్కృతికి, శబ్ద శక్తికి, జాతీయ నానుడులకు మరియు క్రొత్త పదాలకు ఆలయమైన హిందీని మనదేశ జాతీయభాషగా రూపొందించాలని ఉద్దేశ్యంతో ఈ బిల్ ప్రవేశ పెట్టుచున్నాము. కావున మీ మీ అభిప్రాయాలను తెలుపమని" అడిగినప్పుడు శ్రీమతి దుర్గాబాయి, మరియు రెవరెండ్ జే.యం.డీ. సోజే మద్రాసు రాష్ట్రం వారు హిందీని జాతీయ భాషగా రూపొందించుటకు ఒప్పుకున్నారు. అదే విధంగా శ్రీయం.గుప్తా (బొంబాయి) గారు శ్రీ కులాధారచతయట (అసామి) గారు మరియు పండిత్ జవహర్‌లాల్ నెహ్రూ గారు వీరందరి సమక్షంలో జాతీయ భాషను గురించి చర్చ జరిగింది. అందులో అందరు హిందీయే రాష్ట్ర భాషగా యుండుటకు అంగీకరించిరి. మరియు కొన్ని చట్టాలను కూడా రూపొందించిరి. వాటిని గురించి ఈ క్రింద సంక్షిప్తముగా తెలుపబడినది.

తేది 14-9-51 నాడు సంవిధాన సభలో దేవనాగరి లిపిలోయున్న హిందీయే మన దేశ సర్కారీ భాషగా యుండాలని తీర్మానించనైనది. సెక్షన్ 343 లో 1) భారత సర్కారీ భాషగా హిందీయే ఉండాలి 2) హిందీ భాష భారత సర్కారీ భాషగా ఉండుటకు 15 సంవత్సరాలు పట్టును. కావున అప్పటివరకు మాత్రమే ఇంగ్లీషు సర్కారీ భాషగా ఉండును. 3) 15

సంవత్సరాల తర్వాత పార్లమెంటు లో న్యాయశాస్త్రంలో హిందీ ఉండాలి. ఈ సెక్షన్‌లో మూడు ముఖ్యమైన విషయాలున్నవి.

1) భారత సర్కారీ భాషగా హిందీ ఉంటుంది.

2) ధ్వని ఏ భాషలోనిదైన వ్రాత మాత్రము దేవనాగరిలిపిలోనే ఉండాలి.

3) సంవిధాన సభలో కేవలం అక్షరాలు మాత్రమే దేవ నాగరి లిపిలో ఉండాలి. అంకెలు ఇప్పుడున్న అంకెలు ఇంగ్లీషులోనే ఉండాలి. ఎందుకనగా పూర్వం ఈ అంకెలు హిందుస్తానీనుండియే పుట్టినవి. కావున భారత సంవిధాన సభ వీటిని ఒప్పుకున్నది. 343 సెక్షన్ ప్రకారం 1965లో హిందీ భాష సర్కారీ భాష కావలసియుండును. కాని ప్రజలలో తగినయోగ్యత లేనందున మళ్ళీ 15 సంవత్సరాలు వాయిదా వేయబడినది.

344 సెక్షన్ ప్రకారం 20 మంది లోకసభ సభ్యులు 10 మంది రాజ్యసభ సభ్యులు కమిటిగాయుంటారు. వీరు సర్కారీ భాషగా హిందీని అమలుజరుపమంటారు. మనదేశంలోని 14 భాషలలో హిందీని ఆత్మగా భావిస్తుంటారు.

345 సెక్షన్ ప్రకారం ఆయా రాష్ట్రాలలో ఎన్ని బాషలున్నా హిందీని సర్కారీ భాషగా చేసుకోవాలి. 1950 జనవరి 26వ తేది వరకు ఇంగ్లీషు నడుస్తున్న రాష్ట్రాలలో ఇంగ్లీషు ఉండవచ్చును. ఈ సూత్రము ప్రకారమే మద్రాసు, బొంబాయి రాష్ట్రాలలో తేది 26-1-1950 కన్న పూర్వం బహు భాషలుండుట చేత ఇంగ్లీషు సర్కారీ బాషగా ఉండిపోయింది.

సె॥ 348 ప్రకారం ఎంతవరకు మనం హిందీ భాషను మన జాతీయ భాష అని సులభతరమైనదని గ్రహించలేమో అంతవరకు ఇంగ్లీషు బాష అధికారంలో ఉంటుంది. మనజాతి అభిమతాన్ని తెలుసుకొనుటకు హిందీ నేర్వాలి.

సె॥ 347 ప్రకారం మనదేశం గుర్తించిన భాషలు 14 కాని ఇట్లు గుర్తించిన వాటిలో ఇంగ్లీషు భాష లేనేలేదు. కావున దీనిని తొలగించుటకు 15 సంవత్సరాలు వ్యవధి ఇవ్వవలసిన పనిలేదు. ప్రపంచంలోనే హిందీ భాషలాంటి భాషలేదని చెప్పుచున్నది. ఎందు కంటె భాష అనేది తాను లాభం పొందుతూ ఇతరులకు లాభం కల్గిస్తుంది. కావున ఆయా రాష్ట్రాలలోని మాతృభాషకు ప్రధమ స్థానమిస్తున్నది. రెండవస్థానం హిందీకివ్వబడినది. ప్రాంతీయ భాషలో తమ ఆవేదనలు తెల్పుకొనవచ్చును. కాని జాతీయభాషలో సంప్రదింపులుకొనసాగించాలి.

సె॥ 348 లో చట్టం మరి న్యాయం గురించి మాత్రమే తెలుపబడినది.

సె॥ 349 ప్రకారం హిందీ జాతీయ భాషకాదని రద్దు పరచే అధికారం రాష్ట్రపతికి కూడా లేదు.

సె॥ 350 ప్రకారం ప్రార్థన పత్రాలు ప్రాంతీయ భాషలో ఉండవచ్చును. సర్కారీ భాష ఏదైనఉండని, ఇందులో భారతీయులకు పూర్తిగా స్వేచ్ఛనివ్వబడినది. కావున హిందీ సర్కారీ భాషగా రూపొందుటకు ఆలస్యము జరుగుచున్నది.

సె॥ 351లో హిందీ అన్ని భాషల సారము కాబట్టి హిందీ అభివృద్ధికి సహాయము చేయాలను నిర్ణయము కేంద్రము తీసుకున్నది.

రాష్ట్రభాష కోర్టులోని తీర్పుతో తయ్యారయ్యేది కాదు. అది ప్రజలయొక్క అంతర్వాహిని. భాష అనే అంతర్వాహినికి కోర్టులు ఆన కట్టలు కట్టలేవు. ఒక వేళ కట్టిన ప్రవాహము వెనుకకు తిరిగి ప్రవహింపదు. కట్టలు తెంచుకొని ప్రవహిస్తుంది. అదే విధంగా కొంతమందియే

విద్వాంసులు మాట్లాడే భాష ఇంగ్లీషు అధికారంలో కొన సాగలేదు. ప్రాచీన కాలమునందు గాని ప్రస్తుత కాలమునందుగాని హిందీ భాషకంటె సులభతరమైన భాష ఏది లేదు. భారతీయుల మేలుకోరి ఏర్పరచినదే ఈ హిందీ భాష. ఇందులో సందేహమే లేదు. హిందీ భాషను నేర్వండి ఆనందం పొందండి...

ఎందరో మహాత్ములు త్రికరణశుద్ధితో హిందీని రాజభాషగా నిర్ణయించిరి. ఒక్క మాటలోనిజం చెప్పాలంటే హిందీ భాష ఆద్యంతము లేనిది, నిర్జరమైనది, నిష్కళంకమైనది, నిరాడంబరమైనది. రెండవమాటలో చెప్పాలంటె భారతీయ భాషలన్నిటి స్వరాలతో స్వరం కలిపి పాడుతుంది. విదేశీ భాష ఇంగ్లీషు పదాలతో కదము కలిపి ఆడుతుంది. సర్వమత సమ్మతమై ఉప్పొంగుచు జాతి ఐక్యతకు తోడ్పడుసాధన సంపత్తిగ ఉపయోగపడుతుంది. ఆంగ్లేయులు కూడ హిందీ సాహిత్యాన్ని అభివృద్ధి చేయుటకు మన భారతేందు హరిశ్చంద్రగారికి కుడిభుజముగా ఉండిరి. వారిలో మరుపురాని వాడు, ఫ్రెడరిక్‌పిన్ కాటే గారు, పై విషయాలు మీ ముందు పెట్టుటకు ఉపకరించిన గ్రంధము. "భారత సర్కారీ భాష హిందీ"

సీఖో హిందీ బోలో జైహింద్.

ఇట్లు

గ్రంథకర్త

— ఎస్. బిచ్చయ్య, Sr. H.P

నాగవరం గ్రామం, వనపర్తి

ఎమ్.నగర్ PIN - 509103

# భాషలు

| క్ర.సం. | రాష్ట్రము | ప్రాథమికభాష | ఆరంభము హిందీ భాష తరగతి |
|---|---|---|---|
| 1) | ఆంధ్రప్రదేశ్ | తెలుగు | హిందీVI |
| 2) | అస్సామి | | |
| 3) | బీహారు | హిందీ | హిందీ I |
| 4) | ఢిల్లీ | హిందీ | హిందీ I |
| 5) | గుజరాత్ | గుజరాతి | హిందీV |
| 6) | కర్నాటక | కన్నడ | హిందీVI |
| 7) | కేరళ | మళయాళం | హిందీ V |
| 8) | మహారాష్ట్ర | మరాఠీ | హిందీII |
| 9) | పంజాబీ | పంజాబిహిందీ | హిందీI |
| 10) | హర్యాణ | హిందీ | హిందీI |
| 11) | తమిళనాడు | తమిళం | హిందీనిప్రైవేటు గానేర్చుకుంటారు |
| 12) | ఉత్తరప్రదేశ్ | హిందీ | |
| 13) | వెస్ట్‌బెంగాళ్ | బెంగాల్,నేపాల్. | హిందీI |
| 14) | హిమాచల్‌ప్రదేశ్ | హిందీ | హిందీI |
| 15) | సిక్కిం | సిక్కిమాన్[illegible] | హిందీI |
| 16) | ఒరిస్సా | ఒడియా[illegible] | హిందీ V |

# మార్కులు

D.19-11-87

| ప్రా. భా. మార్కులు | ద్వి. భా. మార్కులు | తృ. భా. ప్రారంభము | మార్కులు (తృ-భా) |
|---|---|---|---|
| 35 | 15 to 20 | V | 35 |
| 30 | 30 | VIఐచ్ఛిక్ | 30 |
| 35 | 35 | IV | 35 |
| 35 | 35 | V | 35 |
| 53 | 13 | V | 35 |
| 35 | 35 | V | 35 |
| 35 | 35 | | |
| 33 | 33 | VI | 33 |
| 33 | 33 | IV | 33 |
| 40 | ప్రైవేటుపాఠశాలలు ఉన్నవి. | VI | 40 |
| 33 | 33 | VI | 33 |
| 35 | 35 | V | 30 |
| 33 | 33 | VI | 33 |
| 50 | 50 | I | 50 |
| 33 | 33 | IV | 33 |

ॐ

## శ్రీ రామ రామ నేను చెప్పేది కూడ వినండి

మనదేశమేది? హిందూ

మనజాతీయ భాషేది? హిందీ

మన మాతృభాష తర్వాత నేర్చుకొనవలసినదేది? హిందీ

నీవు ఇప్పుడే భాష నేర్వాలి? హిందీ

ఐతే కొను. "హిందీ అధ్యాపక్"

ఆడుచు పాడుచు నేర్చుటకు అనుకూలమైనది. తెలుగు నేర్చిన ప్రతి వ్యక్తి వ్యాకరణముతో సహా స్వయముగా నేర్చు కొనదగినది సందేహించక కొనండి, చదువండి, మీ సందేహాలను, సలహాలను తెలుపండి.

— సందాపురం బిచ్చయ్య
(హిందీ పండిత్)

## 2

# భయపడకండి. భ్రమపడకండి.

ఓ! విద్యార్థీ సోదరా! వీర మాత పుత్రుడా! హిందీని నేర్వరా!

హిందీ రాదని మదిని కుందబోకుమా!
వ్యక్తి సాధించనిదేది లేదు సృష్టిలోపలన్
కంటితోడ జాచుపదము కల్లగాదురా!
వ్రాయుచున్న గీత లేవి వృథా కావురా!
వల్కబోదు ఒక్కటైన పల్కి తీరవలయురా!
పలుమతములు పలుభాషలు గల్గినట్టి మనదేశం
ప్రతివారికి నతిసులువుగ తెలియుభాష హిందేరా!
హిందీని నేర్వనీకు బాధలేదు సోదరా!
జాతీయ భాష నేర్వజంకు యేలరా!
రాష్ట్ర భాషనేర్చి నీవు రాజ్యమేలుమా!
ఇంతకన్న సరళభాష యేది లేదురా
బాధలేలసోదరా! భావి భారతీయుడా!
నేర్చలేవ! వ్రాయలేవ! పలుక లేవా!!
పరితాపం జెందనేల పెదవు లిప్పి జెప్పరా॥ ఓ॥

— ఎస్. బిచ్చయ్య.
(హిందీ పండిత్)

# ఓం సరస్వత్యై నమః

## తొలిపలుకులు

ఆత్మీయులగు భారతీయులందరికి సాదర ప్రణామములు. పవిత్రమైన ఈ మానవజన్మకు తనమనుగడ సాధించుకొనుటకై పలురకాలభాషలతో తన అభిప్రాయమును వెలిబుచ్చి ఇతరుల అభిప్రాయము తెలసికొనుటకు తగు అవకాశమును కల్పించినాడు ఈ మానవకోటికి మాత్రమే భగవంతుడు.

మన భారత దేశంలో ఎన్నో రాష్ట్రాలున్నాయి. ఆయా రాష్ట్రాలలో ఆయా భాషలున్నాయి. అయినప్పటికిని జాతీయ భాష హిందీ యే ఎందుకైనదో మనము దీర్ఘంగా ఆలోచిస్తే అర్థమౌతుంది.

హిందీ ప్రాంతీయ భాషగా పరిగణింపబడిన రాష్ట్రాలు (1) ఉత్తరప్రదేశ్ (2) మధ్యప్రదేశ్ (3) రాజస్థాన్ (4) హిమాచల్ ప్రదేశ్ (5) బీహార్ (6) హరియాన మొత్తము ఆరు రాష్ట్రాలున్నావి.

పంజాబులో 'పంజాబీ', బెంగాల్ లో 'బెంగాళీ' నాగాల్యాండ్ లో 'నాగా', మహారాష్ట్రలో 'మరాఠీ', కర్నాటకలో 'కన్నడ', ఉడీసాలో 'ఒరియా (ఉడియా)', తమిళనాడులో 'తమిళం', మనీపురిలో 'మనీపురీ', అస్సామ్‌లో 'అస్సామీ' జమ్మూకాశ్మీర్ లో 'కాశ్మీరీ', కేరళలో 'మళయాళ్ళం', ఆంధ్ర ప్రదేశ్ లో 'తెలుగు' మొదలగు ప్రాంతీయ భాషలు వాడుకలో యున్నప్పటికినీ హిందీ బాషనే ఎక్కువ తెలిసిన వారుండుటచే, అన్ని విధాల మానవజాతికి అతి సన్నిహితమైనదిగా యుండుటచే జాతీయ భాషగా పరిగణింప బడినది.

ఈనాడు మన భారతదేశ జాతీయ భాషపై కొందరు విద్యార్థులు మరియు పెద్దలు విద్యావంతులు కూడా చూపు చున్న నిరుత్సాహమే ఈ పుస్తకము వ్రాయుటకు కారణమైనది.

ఆడుచు పాడుచు నేర్చుటచేత అలసట, అరుచి కల్గదను అభిప్రాయముచే వ్రాయుచున్నాను.

సంగీతము ద్వారా నేర్చుకొనుట చేత సంతోషముతో ముందుకు వచ్చి కంఠస్థము చేయుదురు. తర్వాత మరచి

పోజాలరు. ఇది బాలురకు మాత్రమే గాక ప్రతి వారికి ఆనందదాయకముగా నుండును.

కేవలము అక్షరముల రూపము వాటి పలుకుబడిని తెలియజేసినచో నేర్చుకొను వారికి నుత్సాహము గల్గునని తలంచి "హిందీ అధ్యాపక్" అను పుస్తకమును మీ ముందుంచుచున్నాను. నాకు తెలిసినంత వరకు హిందీలో తప్పులు వ్రాయడానికి తప్పులు చదువడానికి వీలుండదు. విదేశీ భాష నేర్చుటకై చేసే కృషిలో నాల్గవవంతైన అధికమే యగునని చెప్పవచ్చు.

మనదేశ జాతీయ భాషను మనమే ధిక్కరించిన మనకు మనదేశానికి కీర్తి ప్రతిష్టలు లోపించుననుటకు సందేహమే లేదు. హిందీని నేర్చుటయందు అశ్రద్ధ చూపుటచేత మనము కూర్చున్న కొమ్మను మనమే గొడ్డలితో కొట్టినట్లు ఉంటుంది. కావున ప్రతి భారతీయుడు ఆనందముతో ముందుకు వచ్చి విద్యనభ్యసించ గలరను అభిప్రాయముతో నేను పుస్తకము వ్రాసి మీ ముందు పెట్టు చున్నందులకు అన్యథాభావించక నన్నాశీర్వదించ గలరని ఆశిస్తున్నాను. కేవలము నా లక్ష్యాన్నీ వీక్షించి, హిందీని మీ పక్షము చేసికొన గలరనియు మరియు

"హిందీ అధ్యాపక్" యను నామమును సార్థకము చేయ గలరని మరి మరి ప్రార్థిస్తున్నాను.

జైహింద్

सीखो हिन्दी बोलो जायहिन्द

అంకితము

భారతీయులకు

— ఎస్. బిచ్చయ్య
(హిందీ పండిత్)

# మనవి

"పరోపకారార్థమిదం శరీరం" సూక్తి ననుసరించి కదలుతూంటుంది నాకలం. నేనువేసే ప్రతి అడుగులో ప్రతి ఆలోచనలో ఏ లోపాలున్నా ఎదురుగా వచ్చి మందలించి నన్నొక మనిషిగా తయారుచేసే బాధ్యత సమాజానికి ఉన్నది.

"పొట్టకూటి కొరకు దొరల పొగడునట్టి కవినిగాదు.
మిట్టిపడెడు వారినెల్ల తెగడునట్టి కవినిగాదు.
దేశమంటే ఇల్లు, ఒళ్ళు, ప్రజలు, భూమి.
సాటిప్రాణి సుఖము గోరి పాటు పడుటె దేశ సేవ!
ఇదే నాకర్మ, ఇదే నా ధర్మం."

ఆత్మీయులు, మిత్రులు, కొందరు పెద్దలు హార్దికంగా, ఆర్థికంగా సహాయ సంపత్తులందించి నన్ను, కృతకృత్యుణ్ని చేసినందులకు నా హృదయ పూర్వక కృతజ్ఞతాభివందనములు అర్పిస్తున్నాను.

## కృతజ్ఞతలు

ఈ గ్రంధరచనకు ఉత్సాహము కల్పించిన పూజ్య గురూజీ శ్రీ డా॥బి. సాయిలు ఆంధ్ర ప్రదేశ్ హిందీ విద్యాశాఖాధికారి గారికి హృదయ పూర్వక కృజ్ఞతాభివందనములనర్పిస్తున్నాను.

అతి స్వల్పకాలంలోనే ఈ గ్రంధ ప్రచురణలో తమ అమూల్య సేవలందించిన శ్రీ బైసాని రామప్రసాద్ గ్రేడ్ 1 హిందీ పండిట్, లోకమాన్య హిందీ బుక్ సెంటర్, విజయవాడ-2 వారికి హృదయపూర్వక కృతజ్ఞతలు అర్పిస్తున్నాను.

గ్రంధకర్త

# ఆశీర్వాదము

అచ్చుపు హిందీ వ్యాకరణ మాటల పాటల మాటలన్ వరా తెచ్చుగ
వింగడించితిరి ఈరిక లీరికలైన కోరికల్.
హెచ్చు ఫలించె బాలలకు మీదు నవైక శ్రమైక దీక్షయున్
బిచ్చుయ హింది పండితులు మీకును మీ శ్రమకున్ జయోస్తికన్

--పల్లానారాయణ శర్మ
ఆంధ్రోపాధ్యాయులు, వనపర్తి.

# भाग 'अ'

## 1 వ పాఠము

## సంగీతము ద్వార హిందీలో అక్షరాభ్యాసము

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| తెలుగు | అ | ఆ | ఇ | ఈ | ఉ | ఊ | ఋ |
| హిందీ | अ | आ | इ | ई | उ | ऊ | ऋ |
| స్వరాలు | స | సా | రి | రీ | గ | గా | మా |

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| తెలుగు | ఏ | ఐ | ఓ | ఔ | అం | అః |
| హిందీ | ए | ऐ | ओ | औ | अं | अः |
| స్వరాలు | దా | పా | మా | గా | రీ | సస |

| | | | | | |
|---|---|---|---|---|---|
| తెలుగు | క | ఖ | గ | ఘ | ఙ |
| హిందీ | क | ख | ग | घ | ङ |
| స్వరాలు | స | రి | గ | మ | పమ |

| | | | | | |
|---|---|---|---|---|---|
| తెలుగు | చ | ఛ | జ | ఝ | ఞ |
| హిందీ | च | छ | ज | झ | ञ |
| స్వరాలు | రి | గ | మ | ప | దప |

| | | | | | |
|---|---|---|---|---|---|
| తెలుగు | ట | ఠ | డ | ఢ | ణ |
| హిందీ | ट | ठ | ड | ढ | ण |
| స్వరాలు | గ | మ | ప | ద | మప |

| | | | | | |
|---|---|---|---|---|---|
| తెలుగు | త | థ | ద | ధ | న |
| హిందీ | त | थ | द | ध | न |
| స్వరాలు | మ | ప | ద | ని | సా |

| | | | | | |
|---|---|---|---|---|---|
| తెలుగు | ప | ఫ | బ | భ | మ |
| హిందీ | प | फ | ब | भ | म |
| స్వరాలు | స | ని | ద | ప | మా |

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| తెలుగు | య | ర | ల | వ | శ | ష | స | హ | క్ష | త్ర | జ్ఞ |
| హిందీ | य | र | ल | व | श | ष | स | ह | क्ष | त्र | ज्ञ |
| స్వరాలు | ద | ప | మ | గ | రి | గ | మ | ప | ద | ప | మ |

| | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| తెలుగు | క | కా | కి | కీ | కు | కూ | కృ | కే | కై | కో | కౌ | కం | కః |
| హిందీ | क | का | कि | की | कु | कू | कृ | के | कै | को | कौ | कै | कः |
| స్వరాలు | స | సా | రి | రీ | గ | గా | మా | దా | పా | మా | గా | రి | సస |

పై విధముగ నేర్పుటచేత పిల్లలు పెద్దలు అతిసులువుగ ఉత్సాహముతో నేర్చుకొనుటకు ముందుకు వచ్చెదరు మరియు మరిచిపోజాలరు.

మిగిత హల్లుల గుణింతము పై విధముగనే నేర్పవలెను. పై కనపరిచిన విషయములను దేహపరిశ్రమ ద్వార గూడ నేర్ప వచ్చును. అది నేర్పువారి కుశలత పై ఆధారపడి యుండును.

# 2 వ పాఠము

## దేహపరిశ్రమద్వార వర్ణమాల శిక్షణ"

అ ( अ ) ను చదువునపుడు చక్కగా నిల్చియున్న విద్యార్థి కుడికాలు ఎత్తి,

ఆ ( आ ) ను చదువునపుడు క్రిందికి దించవలయును.

ఇ: ఈ (इ,ई) కిని గూడ ఇదేవిధముగా ఎడమకాలుతో జేయవలయును.

ఉ (उ) ను చదువునపుడు రెండుచేతులు పిడికిలి బట్టి భుజముల దగ్గర నుంచ వలయును.

ఊ: (ऊ) ను చదువునపుడు కుడిచేయిని పిడికిలి వదిలి భుజానికి క్షితిజ సమాంతరంగా సాచవలయిను.

ఋ (ऋ) ను చదువునపుడు ఎడమచేయిని పిడికిలివదిలి సాచవలయును.

ఎ (ए) నం చదువునపుడు, రెండు మెడిమలు రెండుచేతులు పైకి ఎత్తి ఎడమచేయి బొటనవ్రేలిని, కుడిచేయి బొటనవ్రేలు చూపుడువేలుమధ్య నిరికించిపట్టి వ్రేళ్ళు పైకి సాచవలయును.

ఐ (ऐ) ని చదువునపుడు చేతులను అదేస్థితిలోనుంచి మెడిమలు క్రిందికి దించి తలతోబాటు నడుమును వంచి చేతులు ముందుకు సాచవలయును.

ఓ (ओ) ను చదువునపుడు, తలను చేతులను అదేస్థితిలో నుంచి రెండుకాళ్ళ బొటన వ్రేళ్ళను రెండుచేతుల వ్రేళ్ళతో మొకాల్లు వంచకుండ తాకవలయును

ఔ (औ ) ను చదువునపుడు ఐ (ऐ) ని చదివినప్పటి స్థితిలో నిల్చి యుండవలెను

అం (अं) ను చదవునపుడు రెండు మెడిమలు దించి రెండు చేతులను భుజములకు చక్కగా సాచవలయును

అః (अः )ను చదువునపుడు, రెండు చేతులను తొడలకు ఆనించి పూర్వపు స్థితిలో నిల్చియుండవలయును

क,ख (క,ఖ) ను చదువునపుడు కుడికాలితో అ,ఆ లకు చేసినమాదిరిగా చేస్తు ఒక అడుగుముందు భాగమునకు కదలవలయును.

ग,घ (గ,ఘ) ను చదువునపుడు ఎడమకాలితో ఇ, ఈ లకు చేసిన మాదిరిగా చేయవలెను

ङं (ఙ) కు త్వరగ నిల్చిన స్థలములోనె కూర్చొని లేయవలెను (ఊంగీలమాదిరి)

చ, ఛ, జ, ఝ ఞ (चे,छ,ज झ,ञ) లను చదువునపుడు తన కుడిచేయి భాగమునకు ఒక అడుగు దూరము కదలి క, ఖ, గ, ఘ, ఙ లకు చేసిన విధముగ చేయవలెను.

ట ఠ డ ఢ ణ (ट,ठ,ड,ढ,ण) లకు తాను మొదట నిల్చినప్పటి వెనికి భాగమునకు కదలి చేయవలెను.

త థ ద ధ న (त,थ,द,ध,न) లకు తాను మొదట నిల్చినప్పటి ఎడమభాగమునకు కదలి చేయవలెను.

ప ఫ బ భ మ (प,फ,ब,भ,म) లకు తాను పూర్వము నిల్చినస్థానమునకు కదలి చేయవలెను. य(య) కు కుడి చేయినిపిడికిలి బట్టి బుజము దగ్గర నుంచ వలెను.

ర (र) ను చదువునపుడు పిడికిలి బట్టి పైకి ఎత్తి, ల (ल) ను చదువునపుడు క్రిందికి దించి, వ (व) కు పిడికిలివదలి భుజమునకు

చక్కగా హస్తమును బోర్ల వేసి వ్రేళ్ళ, చక్కగా చేసి చేయిసాచవలయును ఇదే విధముగ

శ ష స హ (श,ष,स,ह) లకు ఎడమ చేయితో చేయవలెను.

క్ష क्ष కు రొమ్ము దగ్గర అదే స్థితిలో చేతులను బెట్టి మోచేతులు రెండు ముక్కుకు సూటిగా వచ్చునట్లు చేయవలెను.

త్ర (त्र) కు భుజములకు చక్కగ 'అం' కు ఉన్న స్థితిలో నుంచవలెను.

జ్ఞ (ज्ञ) కు తాను పూర్వము 'అః'కు ఉన్న స్థితిలో నుండ వలెను.

అచ్చులకు చేసినరీతిగనే హల్లుల గుణింతమునకు చేయవచ్చును.

గమనిక:- విద్యార్థి మొదట "సావధన్" స్థితిలో నిల్చి యుండవలయును, అః మరియు జ్ఞకు గూడ అదే స్థితిలో నుండవలయును. "క ఖ గ ఘ" లు చదువునపుడు దిశలు దిరుగుచున్నప్పుడు ముఖము గూడ త్రిప్పవలెను.

ఉదా :-

क
ख
ग
घ
ङ

त थ द ध न | पफब भ म | च छ ज झ ञ

ट
ठ
ड
ढ
ण

य (య) నుండి ज्ञ (జ్ఞ) వరకు నిల్చినచోట నుండియే చేయవలయును.

# 3 వ పాఠము

## వర్ణముల విభాగము

అచ్చులు : अ आ इ ई उ ऊ ऋ ए ऐ ओ औ
అనునాసికము : अँ
విసర్గము : अः

## హల్లులు (స్పర్శవ్యంజనములు)

కవర్గము: क ख ग घ ङ
చవర్గము: च छ ज झ ञ
ట వర్గము : ट ठ ड ढ ण
త వర్గము : त थ द ध न
పవర్గము : प फ ब भ म
అంతస్థములు: य र ल व
ఊష్మములు : श ष स ह
సంయుక్తాక్షరములు: क्ष त्र ज्ञ
అల్పప్రాణులు : क च ट ड त द प ब
మహాప్రాణులు : ख छ ठ ढ थ ध फ भ
అనునాసికములు : ङ ञ ण न म

## వర్ణములు గుర్తింపుము

अ आ उ ऊ ओ औ अं अः
इ ई ङ ड झ ज्ञ ञऋ क्ष
ङ च य थ भ म श त ल न त्र
र स ख व ब ष क फ प ष ण
ट ठ ढ द ह ध घ छ ए ऐ

# 4 వ పాఠము

## పద్యముల ద్వారా గుణింతము నేర్పుట

### దీర్ఘము

కII ప్రతి హల్లుకు కుడివైపున (మనకు కుడివైపున)
మతి తోడను నిలువు గీత (ा) మరువక నివ్వన్
అతి దీర్ఘము పలుకునదియె
జతగానికి, చెప్పి చదువు చక్కని హిందీ.

ఉదా:- क + ा = का (కా), च + ा = चा (చా), ट + ा = टा (టా)

ఈ విధముగ మిగిత హల్లులకుండిన దీర్గము పలుకును

### గుడ్డి, గుడిదీర్ఘము

తేII గీII వామ భాగంబు గీతపై (ि) వక్రిగీత
ఉన్న నదియె గుడియగును, ఉచ్చరింప
దాని కెదురుగ కుడివైపు నటులెయున్న
గుడికి దీర్ఘము పలుకును గుర్తుగనుము.

ఉదా:- क + ि = कि (కి), च+ि = चि (చి) ट+ि = टि (టి)

क+ी = की (కీ) च+ी = ची (చీ) ट+ी = टी (టీ)

ఈ విధముగనే అన్ని హల్లులు పలుకును.

# 17

## కొమ్ము, కొమ్ము దీర్ఘము, ఋత్వము

తే॥ గీ॥ కొమ్ము ( ु ) కొమ్ము దీర్ఘము ( ू ) ఋత్వ( ृ ) కులము మూడు,
క్రింది భాగము నందుండు కీలుదిరిగి
చూచి చదువను వ్రాయును సులభమయ్య
భయము జెందక నేర్చుమో భారతీయ

కు చు టు

ఉదా:- क+ ु = कु, च+ ु=चु,ट + ु = टु

కూ చూ టూ

क + ू= कू, च + ू = चू ट + ू= टू

కృ చృ టృ

क + ृ = कृ,च + ृ +चृ,ट + ृ = टृ

ఇదే విధముగ అన్ని హల్లులు పలుకును.

## ఏత్వము, ఐత్వము, ఓత్వము మఱియు, ఔత్వము

తే॥ గీ॥ వర్ణశిరము పై నొకగీత వంగియున్న( े )
ఏత్వమగు చుండు హిందీలో ఎప్పుడైన
అటుల రెండున్న ( ै ) దానిపై ఐత్వమగును.
దాని క్రిందొక గీతయు ( ा ) దగిలియున్న
ఓత్వ మౌ త్వం బగుచునుండు. నొప్పుగాను.

ఉదా:- ఎత్వము, ఐత్వము : क + े = के (కే) क + ै = कै (కై)

ఓత్వంఔత్వం : च + ो = चो (చో) च + ौ = चौ (చౌ)

ఈ విధముగనే అన్ని వర్ణములకుండునని గ్రహించుము వర్ణమునకు పై భాగమున సున్న పెట్టిన ముక్కుతో పలుకును.

ఉదా:- अं అం

వర్ణమునకు ప్రక్క భాగమున రెండు సున్నాలు పెట్టిన విసర్గమగును,

ఉదా :- अः అః

## సంయుక్తాక్షరములు

తే॥ గీ॥ రేఫమొకసారి క్రింద మీ దిమిడి యుండు
ధర్మ ( धर्म ) చక్రము ( चक्र ) శబ్దంబు, చదివిచూడ
గాన వచ్చును రేఫంబు కల్లగాదు.
పలుకవచ్చును పరికించి భారతీయ.

ఉదా :- चक्र (చక్ర) भ्रमण (భ్రమణ) प्रणाम (ప్రణామ్)

ఈ విధముగనే చిన్న గీత క్రిందయున్నచో పలుకును,

धर्म (ధర్మ) सर्व (సర్వ) गर्व (గర్వ)

ఈ విధముగనే పై భాగమున వంకర గీతయున్న పలుకును. నిలువుగీతలులేని ट ठ ड ढ లకు వాటి క్రింది భాగమున( ् ) ఈ విధమైన వంకరగీత యుండును.

ఉదా:- राष्ट्र (రాష్ట్ర) హల్లుల యొుక్క అర్థ రూపములు సంయుక్తాక్షరములందు వచ్చును.

ఆ॥వె॥ పదములందు పొల్లు బల్కెడి వర్ణంబు
అంద హీన మొంది అర్థమగును
కుడిన యున్న గీటు కూలగా పై వచ్చు
వర్ణమచట పూర్తి బలుకుచుండు.

ఉదా:- पुस्तक (పుస్తక్) विश्वास (విశ్వాస్) व्यवस्थापक (వ్యవస్థాపక్) శబ్దాదినిగాని శబ్దమధ్యంబున గాని హల్లు యొక్క కుడి ప్రక్కగీత లోపమగుటచే, ఆ హల్లు సగము పలకుచుండును.గాన పై శబ్దము లందు గ్రహించి వేరే శబ్దములను వ్రాయుటకు చదువుటకు నేర్చగలరు.

## ద్విత్త్వాక్షరములు సంయుక్తాక్షరములు

ट ठ ड ढ द ह వీటికి ద్విత్తమందుగాని, సంయుక్త మందుగాని రూపము మారక యుండును.

ద్విత్తములు

ఉదా:- मिट्टी (మిట్టి) कबड्डी (కబడ్డీ)

సంయుక్తములు

विद्यालय (విద్యాలయ్) पाठ्यपुस्तक (పాఠ్యపుస్తక్) द, ठ వీటికి నిలువు గీతలు లేని కారణముచే వాటి క్రింద నొక చిన్న గీత ( ् ) ఈ లాంటిది యిచ్చిన చాలును.

తే॥ గీ॥: జాతి, నామ, సామూహిక శబ్దమందు
పొల్లు బల్కక వర్ణంబు పూర్తి బల్కు
శబ్ద మంతిమ వర్ణంబు సగము బల్కు
తఱచుగా పొల్లు బల్కక,తప్ప దెపుడు.

సామాన్యంగా హిందీ చివర వర్ణము పొల్లు బల్కును. కాని కొన్ని విషయాల్లో పూర్తిగా పల్కుచుండును.

ఉదా:- जन गण मन अधिनायक जय हे भारत भाग्य विधाता

పై శబ్దములందు హిందీ భాషానుసారముగా పల్క గూడదు.

ఉదా:- జెన్ గణ్ మన్ అధినాయక్ జెయ హే భారత్ భాగ్యవిధాతా యని పలుకరాదు ( జనగణమన అధినాయక జయహే, భారత భాగ్య విధాత) యని పలుక వలెను.

ఈ క్రింది వ్రాయబడిన గుణింతమును గుర్తించుము.

नानी नी नानन्तु नेन्तु ना नानानि नेनन्नाना नि
నానీ నీ నానను నేను నా నానాని నేనన్నానా ని

**పై శబ్దాలలో గుణింతముతో బాటు శబ్దార్థములు గ్రహింప** వచ్చును.

# भाग 'आ'

## 1 వ పాఠము

### హిందీలో పలుకుబడి

### రెండు వర్ణములు

శబ్దము యొక్క చివరి వర్ణము దీర్ఘము లేనిచో పొల్లు బల్కును.

ఉదా:- अब (అబ్) ను 'అబ యని పలుకరాదు ఇట్లే फल (ఫల్) ను ఫల' वन (వన్) ను, 'వన' యని పలుకరాదు

### మూడు వర్ణములు

ఉదా:- पवन (పవన్) ను 'పవన' सूरज (సూరజ్) ను 'సూరజ' యని పలుకరాదు. ఇందులో మొదట రెండు వర్ణములు పూర్తిగా బలకి చివరి వర్ణము పొల్లు బల్కును.

### నాల్గు వర్ణములు

ఉదా:- नटखट (నట్ఖట్) ను 'నటఖట' యని कसरत (కస్రత్) ను 'కసరత' యని పలుకరాదు. ఇందులో రెండవ, నాల్గవ వర్ణము పొల్లు బల్కును. ఈ నియమము సంయుక్తాక్షరములందు పనికిరాదు.

ఉదా:- प्रचलित (ప్రచలిత్) पुत्रलाभ (పుత్రలాభ్) ఈ శబ్దములందు రెండవ వర్ణము పొల్లు బల్కుట లేదు గావున తెల్పసైనది.

## ముఖ్యాంశములు

హిందీలో శబ్దములను చదువు విధానము మఱియు వాటి ఆకార, వికారములను గ్రహించిన తర్వాత స్వయముగా చదువుటకు వీలుంటుంది, అర్థములను శబ్దకోశము ద్వారా గాని పండితుల ద్వారాగాని తెలిసికొనుట శ్రేయస్కరము.

తెలుగు తెలిసిన ప్రతి భారతీయుడు భారతవాసుడు ఈ జాతీయ భాషయైన హిందీని కొలది దినములలోనే వ్రాయుటను చదువుటకు నేర్చుకొనును. వ్యాకరణాది విషయముల నేర్చుట, అది మీమీ జిజ్ఞాస పై నాధారపడి యున్నది.

మన దేశములో తమ తమ మాతృ భాషల తర్వాత మనదేశ జాతీయ భాషయైన హిందీని నేర్చుట ప్రతి భారతీయుని కర్తవ్యముగ తెలిసికొని నేర్చినచో మన దేశకీర్తి ప్రతిష్ఠలకు హద్దు ఉండదని నా యభిప్రాయము. మీరు కూడ సుదీర్ఘంగా ఆలోచించిన అంతే తేలుతుందని నా విశ్వాసము.

మీరు ఇంత వరకు హిందీ శబ్దముల పలుకువిధానము నేర్చుకొంటిరి గాన హిందీ శబ్దములను చదువుటకు ప్రయత్నించుము.

# 2 వ పాఠము

## శబ్ద నిర్మాణములు

### ఒకే వర్ణములో వచ్చు శబ్దములు

मैं (మై) నేను, तू (తు) నీవు, ये (యే) ఇవి వీరు, वे (వే) అవి, వారు, माँ (మా॰) తల్లి, में (మే) లోపల क्यों (క్యొ) ఎందులకు, పైన యున్నట్టి శబ్దాలు ఒకే వర్ణముతోయున్నప్పటికిని అర్థమును తెలియ జేయు చున్నవి గాన శబ్దములన బడుచున్నవి.

### రెండు వర్ణములతోవచ్చు శబ్దములు

अब (అబ్) ఇప్పుడు, कब (కబ్) ఎప్పుడు, कहाँ (కహాం) ఎక్కడ, तब (తబ్) అప్పుడు, यह (యహ) ఇది, ఇతడు, ఈమె, वह (వహ) అది అతడు, ఆమె, जल (జల్) నీరు, घर (ఘర్) ఇల్లు, धन (ధన) ధనము.

### మూడు వర్ణముల శబ్దములు

अनल (అనల్) అగ్ని, अनिल (అనిల్) వాయువు, बतख (బతఖ్) బాతు, कमल (కమల్) కమలము, (चरण ) (చరణ్) పాదము, भगत (భగత్) భక్తుడు.

### నాల్గు వర్ణముల శబ్దములు

नटखट (నట్‌ఖట్) తుంటరి, षटपद (షట్‌పద్) తేనెటీగ, तलवार (తల్‌వార్) కత్తి, शलगम (శల్‌గమ్) ఒక విధమగు దుంప.

## సంయుక్తాక్షరములు

विश्वास (విశ్వాస్) నమ్మకము, सत्य (సత్య) సత్యము, मुश्किल (ముశ్కిల్) కష్టము स्वादिष्ट (స్వాదిష్ట) రుచి గల स्वास्थ्य (స్వాస్థ్య) ఆరోగ్యము, गर्व (గర్వ) గర్వము, धर्म (ధర్మ) ధర్మము, अद्वितीय (అద్వితీయ) సాటిలేని, विद्वान (విద్వాన్) విద్యావంతుడు पद्य (పద్య) పద్యము.

## ద్విత్వాక్షరములు

मिट्टी (మిట్టీ) మన్ను, कबड्डी (కబడ్డీ) కబడ్డీ, कुत्ता (కుత్తా) కుక్క, भिन्न (భిన్న) వేరు, गद्दी (గద్దీ) సింహాసనము, పరువు, बुद्धि (తెలివి) बच्चा (బచ్చా) పిల్లవాడు.

అన్ని రాకాల శబ్దాలను పలుకు విధానము, మరియు వ్రాయు విధానము తెల్పితిని. గాన మీకు స్వయంగా చదువు శక్తి లభించియుంటుంది కావున ఈ క్రింది పాఠములను చదువ గలరని ఆశిస్తున్నాను.

भाग 'ई'

# 1 వ పాఠము

प्रति दिन सूर्य निकलने से पहले उठो। बिस्तर से उठते ही दाँत साफकर, स्नान करने बाद भगवान की उपासना करो। सत्य मार्ग पर चलो और सदा सत्य बोलो। अपने माता पिता की बात मानो। पाठशाला को समय पर जा/ समय पर भोजन करो। पशुओं पर दया करो। गुरू का आदर करो। निर्धन की सहयता करो।

# 2 వ పాఠము

## "स्वागत बोलो" (कविता)

सुनो सुनो हे! प्यारे बालक,
मेरे मन की बात मेरे मन की बात
हिन्दुस्तान के रहने वाले,
बोलो जैहिन्द सीखो हिन्दी।

जो लिखते है सो पढते है
एक लखीर भी व्यर्थ नहीं है।
कहाँ कठिन है हिन्दी भाषा
पढने लिखने समझने में।
कहाँ पर भी यह कठिन नहीं ेह
हिन्दी सीखने आगे आओ।

संसार भर में फैल गई है।
सब से आगे बढ रही है।
विशव की भाषा हो रही है।
पँडित हो कर डरते क्यों हो?

भारत के नेता तुम बन जाओ,
दुर्विचारों को दूर भगाओ।
सद्विचारों को स्वागत बोलो।

## 3వ పాఠము

## देखो और सीखो (कविता)

देखो सागर की लहरें,
सुनो लहरों की सुन्दर राग।
सारी बूँद एक जगह पर,
मिलकर बडा सागर बन कर,
कैसा मजा उडा रहा हैं?

सीखो सागर की साहस,
सूर्य तपन से नभ में जा कर
शीतल पवन से पृथ्वी आकर,
प्राणि कोटि का पालन करने
आने वाली नदियों को देखो।
सीखो तुम सब कुछ इस से।

# 4 వ పాఠము

## "धर्म वीर कहलाओ" (कविता)

कसरत करके जिस्म बढाओ।
किताबें पढकर अकल बढाओ।
मत कीजिए कभी भी नकल,
खामोश बैठो कान खोल के,
गुरू जनों के उपदेशों को
सुन लीजिए दिलचास्पी से।
लिख लीजिए अपनी कागज पर।

मेहनत करके नेमत खाओ
चोरी करके खाते क्यों घास।

पाठशाला एक पुण्य क्षेत्र है।
कल्प वृक्षों की भाँति किताबें हैं।
तुम जो चाहे सो फल देते।
सब कुछ खाओ सद्वृत्ति से।
मा बाप की चाह मिटाओं,
प्रतिना पालन करना सीखो।
आगे अपने भावीकाल में
अमरवीर कहलाओ कर्मवीर कहलाओ,
धर्मवीर कहलाओ

# "गुरू शिष्य संवाद" (पुनरावृत्ति)

गुरू : अ. से लेकर औ तक क्या कहते हैं?

शिष्य : अ, से लेक औ तक स्वर कहते हैं।

गुरू : क, च, ट, त, और पवर्गों को क्या कहते हैं?

शिष्य : क, च, ट, त, और पवर्गो को स्पर्श व्यंजन कहते हैं।

गुरू : य, र, ल, ओर व को क्या कहते हैं?

शिष्य : य, र, ल, और व को अंतस्त्य कहते हैं।

गुरू : श, ष, स, और ह, को क्या कहते हैं?

शिष्य : श, ष, स, और ह, को ऊष्म व्यंजन करहते हैं।

गुरू : क्ष, त्र, और ज्ञ, को क्या कहते हैं?

शिष्य : क्ष, त्र, और ज्ञ, को संयुक्ताक्षर कहते हैं।

गुरू : संयुक्ताक्षर किसे कह्वते हैं?

शिष्य : असमान वर्णो के मेल को संयुक्ताक्षर कहते हैं।
जैसेः- क+ष =क्ष, त+र=त्र, ज+ञ+ज्ञ आदि।

गुरू : समान वर्णो के मेल को क्या कहते हैं?

शिष्य : समान वर्णो के मेल को द्वित्ताक्षर कहते है?
जैसे :— ट+टी=ट्टी,
मिट्टी ल+ली=ल्ली
बिल्ली आदि।

गुरू : अल्प प्राण : किसे कहते हैं?

शिष्य : प्रत्येक वर्ग के पहले और तीसरे वर्णो को अल्प प्राण कहते हैं। अर्थात् क,च,ट,त, और प,

वर्गो में से ही।

गुरू : महा प्राण किसे कहते हैं?

शिष्य : प्रत्येक वर्ग के दूसरे और चौथे वर्णो को महा प्राण कहते हैं। अर्थात् क,च,ट,त, और प, वर्गो में से ही।

गुरू : अनुनासिक किसे कहते?

शिष्य : प्रत्येक वर्ग के अंतिम वर्णो को ही अनुनासिक कहते हैं। अर्थात् क,च,ट,त, और प, वर्गो में से हैं।

गुरू : बारहखडी किसे कहते हैं?

शिष्य : स्वर और व्यंजनों के मेल को "बारह खडी" कहते हैं। (जो स्वर की सहायता से व्यंजनों की आवाज बदलती रहती है)

गुरू : स्वर प्रकट होने के लिए हर एक स्वर के लिए निर्णयात्मक सांकेतिक लकीरें होती हैं उन लकीरों को व्यंजनों के आगे पीछे नीचे और ऊपर लगाई जाती हैं और उन सांकेतिक निशानों के अनुसार व्यंजनों की आवाज जो प्रकटित होती हैं उसे क्या कहते हैं।

शिष्य : बारहखडी में व्यंजनों का रूप प्रकटना कहते हैं।

गुरू : शब्द किसे कहते हैं?

शिष्य : अक्षर एक ही हो या दो, या कुछ अक्षरों का समूह हो उन से कोई न कोई अर्थ मिलता है तो उन्हें शब्द कहते हैं।

जैसे : माँ, बाप, मैं, तुम, कमल, वनचर और सालार्जंगमीजियम आदि।

गुरू : वाक्य किसे कहते हैं?

शिष्य : जिन शब्दों से व्यक्ति का अभिप्राय या विषय का पता मालूम होता है उसे वाक्य कहते हैं।

गुरू : कर्ता किसे कहते हैं?

शिष्य : किसी एक काम में मग्न हो कर काम करने वाले व्यक्ति (वाक्य में जो शब्द प्रधान होता है उसे कर्ता कहते हैं। जैसे राम ने रोटी खाई। इस वाक्य में 'राम' शब्द कर्ता है।

गुरू : 'कर्म किसे कहते हैं?

शिष्य : कर्ता से जो काम कराया जाता है उसे 'कर्म–, शब्द कहते हैं। जैसे 'राम ने रोटी खाई" इस वाक्य में 'रोटी' कर्म है।

गुरू : क्रिया किसे कहते हैं?

शिष्य : कर्ता से जो काम किया जाता है और उस काम का समाप्त मालूम करने वाला शब्द को क्रिया कहते हैं, जैसे :– रामने "रोटी खाई" इस वाक्य में "खाई क्रिया शब्द है क्योंकि इस से काम का पता मालूम हो रहा है।

गुरू : नाम वाचक शब्द किसे कहते हैं?

शिष्य : किसी प्राणियों का स्थलों का और वस्तुओं का नाम जिन शब्दों से मालूम होते हैं उन्हें नाम वाचक कहते हैं। जैसे रामु, दिल्ली, हिमालय, और कृष्णानदी आदि।

गुरू : सर्वनाम किसे कहते हैं?

शिष्य : नाम के बदले जो शब्द आते हैं उन्हें सर्वनाम कहते हैं जैसेः राम अच्छे विद्यार्थी है, लेकिन

वह पाठशाह्वा समय पर नहीं आता। इस वाक्य मे 'वह' सर्वनाम हैं।

गुरू : विशेषण किसे कहते हैं?

शिष्य : वाक्य में जो शब्द, संज्ञा के पहले या बाद में आकर उसका विशेषता बतलाता है उसे विशेषण कहते हैं। जैसेः— दिल्ली बडा नगर है। समुद्र का पानी खारा है। यह काला गाय हमारी है आदि।

गुरू : अव्यय किसे कहद्ये हैं।

शिष्य : लिंग, वचन भेद रहित होकर भूत, भविष्यत और वर्तमानकाल में जो शब्द नहीं बदलेगा उसे अव्यय कहते हैं। जैसेः– राम ने जल्दी आया। सीता ने जल्दी गई। इन वाक्यों में शब्दों के परिवर्तन नहीं है इस लिंए इन्हें अव्यय कहते हैं।

उदा :– अगर = ఒకవేళ

अयवा = లేక

न = కాదు आदि

# गाते हुए ग्रहण करना (संवाद)

स्थान :– उपवन

समय :– सायंकाल

पात्राएँ :– गीता, सीता

रंग मंच पर परदा उठता है और सीता तथा गीता उपस्थित रहती हैं।

गीता : सीता तुम क्या कर रही हो?

सीता : मैं हिन्दी पाठ पढ रही हूँ÷

गीता : कौनसा पाठ पढ रही हो तुम सीता।

सीता : "हिन्दी बाल गीतावली" नामक पुस्तक है इस से हम लोग हिन्दी आसानी से सीख सकती हैं।

गीता : अच्छा आप एक गाना गाओ सीता।

सीता : एक 'अनार' शब्द के साथ-साथ उसके बारे में कई नए शब्दों की जानकारी होते हैं।

गीता : सीता अनार का अर्थ है तेलुगु में "दानिम्म पँडु" है और क्या सीखी गई हो तुम सीता।

सीता : नहीं गीता केवल शब्द का अर्थ सीखने से लाभ नहीं उसके बारे में हर विषय की जानकारी होना आवश्यक है।

गीता : हाँ, हाँ, अपना कहना ठीक है लेकिन सीखना मुश्किल है।

सीता : नहीं, नहीं गीता मुश्किल की बात बिलकुल नहीं है, सीखने के ढंग सरल है।

गीता : वह ढंग क्या है सीता। बताओ जरा मुझे।

सीता : वह ढंग है कि गाते हुए सीखना" इस से विषय का पूर्ण रूप बोध होता है सुनो गीता।

(अ) गीता गीता अनार, देखो, गेंद जैसे गोला है।
लाल सफेद रंगों की, जवारी जैसे बीजें हैं।
बाजर जाकर लायी हूँ, दोनों मिलकर खाएगी।

गीता : बहुत ठीक है सीता बहुत ठीक है।

सीता : ठीक ही नहीं इस में बहुत कुछ नए शब्दों के

अर्थ के साथ अनार के बारे में सब कुछ मालूम हो गये हैं।

गीता : आपके लिए इस में कितने नए शब्द हैं?

सीता : मेरे लिए तो 'गेंद' लाल, गोला, सफेद, जवारी, बीजें, बाजार और मिल कर आदि नए शब्द है।

गीता : हाँ एक शब्द के साथ कुछ नए शब्दों के अर्थ भी सीखने का अवसर मिलता है।

सीता : (अपने हाथ से किताब देते हुए) तुम भी एक गाना गाओ गीता।

गीता : (पुस्तक लेकर)

(आ) आम के फल आये हैं, बहुत मीठे होते है।
आम के फल लाओ सीता, खाकर खामोश बैठूंगी।
नहीं तो शोरमचाऊँगी, सीता आम मंगाओ।

सीता : आपके गाना आम से अधिक मीठा है गीता।

गीता : इस में शोर, खामोश, मंगाओ आदि नए शब्द हैं सीता।

सीता : गीता अभी एक गाना सुनाओ।

गीता : (इ) इमली इतना खट्टा है,
इसे अकेला खाते नहीं कोई।
लेकिन दाल में
अच्छा होता,
इमली डाल कर दाल पकाओ।
पेट भर खाऊंगी, रात भर सोऊंगी

सीता : इस में भी कुछ नए शब्द आये है और उन की जानकारी भी हो चुकी हैं।

गीता : अच्छा आप ईख के बारें में सुनाओ सीता।

सीता : (पुस्तक लेकर)

(ई) ईख एक तरह की फसल है,
बाँसों की भांति लंबे होते हैं
उन्हें डालने से मिशन में,
उसमें मधुर रस निकलता है।
गुड-शक्कर बनतें हैं, उससे
नाना मिठाइयाँ भी बनते हैं।

गीता : सीता मीठा है तुम्हारा गाना भी। इसलिए आप और एक गाना सुनाओ सीता।

सीता : (उ) उपवन जाकर आराम लेना,
अमृत जैसे हवा में हम सब,
विहार यात्र करलेना,
हम सब स्वास्थ्य बन जाना।
सुन्दर फूल चुन लेना,
जल्दी वापस घर आजाना।

इसमें भी बहुत कुछ नए शब्दों का ज्ञान प्राप्त हो रहा है कि आराम, हवा, चुन लेना, आदि।

गीता : अच्छा आप और एक गाना सुनाओं सीता।

सीता : अच्छी बात सीता गाऊंगी सुनो अब।

(ऊ) ऊनी कपडा सर्दी में, बहुत गरम देता है।
देखने सुन्दर लगता है, पहनने लायक होता है।
सारे जग में ऊनी कपडे, पहनने वाले कम हैं।

गीता : इस में तो गरमी, सर्दी पहनना और लायक नए शब्द हैं।

सीता : आप की आवाज बहुत मीठा है। आप भी एक गाना सुनाओ गीता।

गीता : नहीं नहीं आप की आवाज बिलकुल ठीक है आप ही सुनाओ सीता।

सीता : नहीं इस बार आप ही सुनाओ दूसरी बार मैं सुनाऊँगी।

गीता : अच्छा सीता सुनो (गीता पुस्तक लेकर पढती है)

(ऋ) ऋषि एक ज्ञान संपन्न व्यक्ति है,
कृषि धन धान्यसंपन्न व्यक्ति है
व्यक्ति चाहे तो ऋषि बनजाता है,
चाहे तो विलासी बनजाता है
चाहे तो कर्म वीर बन जाता है।

सीता : यह बहुत नीतिदायक कविता है, कंठस्थ करने योग्य है। मैं भी एक गाना गाऊँगी गीता।

(ए) एक-एक बूंदें पानी की मिलकर,
बन जाता है एक बडा सागर।
दुनियां में एक ही व्यक्ति,
नहीं करेगा कोई काम,
इससे हम सब मिलकर सदा,
समाज सेवा करना चाहिए।
(गीता पुस्तक लेती है)

गीता : (ऐ) ऐक्यता से ही सब कुछ कार्य
बडा हो या छोटा भी हो,
आसानी से विजय पा सकते।
सोचो मत कुछ भी इस में।
आप भी एक सुनाओ सीता।

सीता : (ओ) ओछापन छोडकर बिलकुल,
ओजस्वी बनो तुम सदा
ओदर भर ओदन खाकर
आलसी आदमी मत बन जाओ।

गीता : सब से ठीक है यह गाना सच है सीता सच है। एक गाना बाकी है सुनाओ सीता।

सीता : नहीं नहीं यह गाना आप ही सुनाओ गीता।

गीता : (औ) औरत मरद इस दुनियां में,
अकेला हो करजी नहीं सकते।
दहेज लेना दहेज देना,
अवसर किसी को नहीं रहना।
फ़ालतू काम करो मत,
पागल होकर फिरो मत।

सीता : अच्छी बात गीता हम घर चलींगे।

गीता : अच्छी बात सीता समय भी नहीं है, श्याम हो रहा है चलींगे चलो सीता चलो सीता।

(गीता और सीता अंदर चलती हैं पर्दा गिरता है)

## 37

# कर भला हो भला

सुनलो मेरे प्यारे बालक
सुन करआगे कदम बढाओ

संग जीवि यह मानव जाति।
सब से मिलकर रहना पडता।
सब का काम अपनाना पडता।
कुटिल बूद्धि से अलग रहेंतो।
कई कष्टों को अपनाना पडेगा।

सुन्दर उपनव की . रक्षा करने।
काँटेली झाडों का अवसर लगता।
इस लिए हे प्यारे बालक।
सब के साथी बन कर तुम्हें
मधुर वचन से मिलना सीखो।
सत्य मार्ग पर चलना सीखो।

शिक्षा द्वारा ज्ञान कमाओ।
अच्छे आदमी कहलाओ।
तभी होता सफलता अपना जीवन।
सब को बताओ अपना मार्ग।
कर भला हो भला।

## 38

# बुद्धि मान कौन?

कौन दानव है? कौन मानव है?
कौन ज्ञानी है? कौन अज्ञानी है?
दानव में मानव में अन्तर क्या है?

आज –
खाने में पीने में
और व्यवहार में भी
दिखाते हैं कौन भेद?
दानव तो नरमृग भक्षक हैं।
मानव तो खग मृग भक्षक हैं।
दानव तो नाखून से चीरते हैं।
मानव तो चाकू से काटते हैं।

दानव तो सुरों को सताते हैं।
मानव तो नरों को रूलाते हैं।
दानव तो मुनियों को सताते हैं।
मानव तो दीनों को रूलाते हैं।

दानव तो सुधा चाहने वाले हैं।
मानव तो मधिरा चाहने वाले हैं।

वे करते हैं पसंद कन्या की रूपरेखा केवल
ये करते हैं पसंद बिलकुल रूप्यों की गठरी केवल

वे कन्या को चुराने वाले हैं। ये पत्नी को भगानेवाले हैं।
वे परोक्ष वंचक हैं ये प्रत्यक्ष वंचक हैं।
कानों से सुनते हैं उनकी कहानी
आँखों से देखते हैं इनकी कहानी
कौन मानव है? कौन दानव है?
इन दोनों में अंतर क्या है?

## व्याकरण भाग 'अ'

# 1 వ పాఠము

## విభక్తులు

విభక్తులనగా వాక్యములోని శబ్దముల మధ్యన సంబంధము తెలియ జేయునవి. తెలుగు భాషా సంప్రదాయాను సారముగ ఈ క్రింది విధమును చూడుదు.

| | | | |
|---|---|---|---|
| 1) | ने | డు, ము, వు, లు | ప్రథమా విభక్తి |
| 2) | को | ని, ను, లు, | ద్వితీయ విభక్తి |
| 3) | से | చే, చేతన్, తో, తోడన్ | తృతీయ విభక్తి |
| 4) | को के लिए, के वास्ते | కొఱకు, కై | చతుర్థి విభక్తి |
| 5) | से | నుండి, వలన, కంటే, కన్న, ద్వార | పంచమీ విభక్తి |
| 6) | का, के, की | యొక్క | షష్ఠి విభక్తి |
| 7) | में, पर | అందు, మీద, పైన | సప్తమీ విభక్తి |
| 8) | हे, अरे, अरी, | ఓయీ, ఓసి, ఓరీ, | సంబోధన విభక్తి |

సూచన :- హిందీ భాష సంప్రదాయానుసారముగ తెలుగులోని ద్వితీయ విభక్తి ప్రత్యయముల ', గూర్చి గురించి లకు के बारे में యును, తృతీయ విభక్తికి బదులుగా के साथ వచ్చును

ఉదా: - ద్వితీయ విభక్తిలో, आप गाय के बारे में दस पंक्तियाँ लिखिये

తృతీయ విభక్తిలో आप के साथ मैं भी आऊँगा

పై విభక్తులందు ने ప్రత్యయము, భూతకాలము నందు మాత్రమే వాడబడును.

ఉదా:- राम ने रोटी खाई। రాముడు రొట్టె తినెను, కాని వర్తమాన, భవిష్యత్తుకాలములో ने ప్రత్యయము రాదు.

ద్వితీయ విభక్తి राम ने लक्ष्मण को बुलाया।

రాముడు లక్ష్మణుని పిలిపించెను

తృతీయవిభక్తి राम से सीता ने प्रार्थना की।

రామునితో సీత ప్రార్థించెను.

राम ने लक्ष्मण से फल मँगाया।

రాముడు లక్ష్మణునిచే పండ్లు తెప్పించెను.

చతుర్థి విభక్తి लक्ष्मण राम के लिए फल लाया।

లక్ష్మణుడు రాముని కొఱకు పండ్లు తెచ్చెను.

मै ने आपके वास्ते आया।

నేను నీ కొఱకు వచ్చితిని.

పంచమీ విభక్తి (पेड से फल गिरा) చెట్టు నుండి ఫలము పడెను.

राम से लक्ष्मण छोटा है।

రాముని కంటె లక్ష్మణుడు చిన్నగాయున్నాడు. (చిన్నవాడు)

राम से यह काम होता है।

రాముని వలన ఈ పని అవుతుంది.

नल से पानी निकलते हैं।

నల్ల (పంపు) ద్వార నీరు వచ్చును.

## పుంలింగము

షష్ఠి విభక్తి, ఏకవచనము　　यह राम का घर है।

ఇది రాముని యొక్క ఇల్లు.

బహువచనము　　ये राम के घर हैं।

ఇవి రాముని యొక్క ఇండ్లు.

## స్త్రీ లింగము

ఏకవచనము　　यह किताब सीता की है।

ఇది సీత యొక్క పుస్తకము.

బహువచనము　　ये सीता की किताबें हैं।

ఇవి సీత యొక్క పుస్తకములు.

'का' పుంలింగ ఏకవచనములో 'के' బహువచనములో 'की' స్త్రీలింగ ఏకవచన బహువచనము లందు వచ్చును.

లింగ భేదములను బట్టి ఏకవచన బహువచనము లందు క్రియ యొక్క రూపము మారు చుండును.

## "పుంలింగము"

ఉదా: - है, ఏ॥ मैं विद्यार्थी हूँ। నేను విద్యార్థిని.
ఏ॥ तुम विद्यार्थी हो। నీవు విద్యార్థివి.
బ॥ हम विद्यार्थी हैं। మనము విద్యార్థులము

## స్త్రీ లింగము

ఏ॥ मैं विद्यार्थिनी हूँ। నేను విద్యార్థినిని
ఏ॥ तुम विद्यार्थिनी हो। నీవు విద్యారినివి
బ॥ हम विद्यार्थिनीयाँ हैं। మనము విద్యార్థినులము

## (खा) ధాతువు పులింగము,

ఏ॥ राम फल खाता है। రాముడు పండ్లు తినును.
బ॥ राम और लक्ष्मण फल खाते हैं।
రాముడు మరియు లక్ష్మణుడు పండ్లు తిందురు.

## 'खा' ధాతువు స్త్రీ లింగము

सीता फल खाती है।

సీత పండ్లు తినును.

सीता और गीता फल खाती हैं।

సీత మరియు గీత పండ్లు తిందురు.

## పుంలిగము 'लिख'ధాతువు

ఎ॥ राम पत्र लिख़ता है। రాముడు పత్రము వ్రాయును.

బి॥ राम और लक्ष्मण कविताएँ लिखते हैं।

రాముడు మరియు లక్ష్మణుడు పద్యములు వ్రాయుదురు.

## స్త్రీలింగము లిఖ ధాతువు

ఎ॥ सीता कविता लिखती है। సీత పద్యము వ్రాయును.

బి॥ सीता और गीता कविताएँ लिखती हैं।

సీత మరియు గీత పద్యములు వ్రాయుదురు.

పై క్రియా పదములందు హిందిలో మాత్రమే రూపము

మార్పు జరిగినది తెలుగులో జరుగలేదు.

ఉదా॥ राम पढता है। రాముడు చదువును.

सीता पढती है। సీత చదువును.

बैल आ रहा है। = ఎద్దు వచ్చుచున్నది.

गाय आ रही है। = ఆవు వచ్చుచున్నది.

తెలుగులో జంతువాచక శబ్దములందు ఏర్పాటు రూపములు క్రియా శబ్దములందు యుండవు. హిందీలో యుండును.

అకారాంత పుంలింగ ఏకవచన హిందీ శబ్దమునకు మాత్రమే విభక్తి చేరునపుడు శబ్దాంతమున 'అకారము' 'ఏకారము' యగును, తక్కిన శబ్దాములకు మార్పు కలుగదు.

